శ్రీ ర స్తు.

# శ్రీ భగవన్నామ సంకీర్తనము

ముముక్షువులగు భక్తజనుల కత్యంతోపయోగము

శ్రీ భగవద్దాసానుదాస దామెర్ల వీరరాఘవ దాసకృతము






విశాఖపట్టణమునందుండు

చిన్నకోట అప్పలనరసింహులుగారి

స్వకీయ, శ్రీ శారదా మకుట ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపబడినది.

మన్మథనామసంవత్సర ఆషాఢశు ౧౫ స్థిరవారము.

Printer A. VENKATAREDD.



# ఉపోద్ఘాతము.

ఈకలియుగమందలి జనులు అల్పాయుష్కులు బలహీనులు నగుటవలన వీరు తక్కిన యుగములలో వారివలె జపతపములు యజ్ఞయాగాదులు చేయలేకపోయినను భగవన్నామసంకీర్తనమునుమాత్రము చేసినయెడ తరింతురని పరమకారుణికుండగు భగవంతు డానతిచ్చియుండుటను బట్టి మనము అనుదినమును భగవన్నామసంకీర్తనము చేయుట ముఖ్యకార్యము అట్టిసంకీర్తనము రాగతాళయుక్తమయిన సంగీతరూపముగా నుండినయెడ నది భగవంతునకు చాల ప్రీతికరము. అయితే అనంతకళ్యాణగుణగణపరిపూర్ణుడగు భగవంతుని స్తుతియించుట మనకు శక్యమాయనితలంచెదరేమో- అట్లుగాదు. బ్రహ్మరుద్రాదులు సైతము వాని గుణములను సాంతముగా స్తుతిచేయలేకపోయినను శబరి, విభీషణుడు, కుచేలుడు, అక్రూరుడు మొదలగువారలు తమశక్త్యనుసారముగా భగవంతుని స్తుతిజేసి వాని దయకు పాత్రులుకాలేదా. కావున మనమును మనశక్తికి తగినటుల వానిని స్తుతియించుటయే ముఖ్యకార్యము. గనుక పరమదయాళుడగు భగవంతుడు అప్పుడప్పుడు తనస్మరణయందు నాకు బుద్ధినుదయింపజేసి అజ్ఞుడనయిన నానోట తన స్తుతిపూర్వకముగా నిర్వ్యాజకృపతో బయలువెడలించిన కొన్నికృతులును, కీర్తనలును సంగ్రహించి యీచిన్నిపుస్తకములో ముద్రించడమయినది. గానభక్తాగ్రేసరులు పెద్దలు పండితులు వీనిని బాలసంజల్పములట్లగైకొని వీనియెడంగల దోషములను గణనసేయక గుణలేశమేమైన నుండినయెడ దానినే పరిగ్రహించి సంతసింతురని పదింబడిగ ప్రార్థింపుచున్నాడను.

ఇట్లు శ్రీభగవద్దాసానుదాసుడు,
దామెర్ల వీరరాఘవదాసుడు.



శ్రీ ర స్తు

శ్రీమతే రామానుజాయనమః.

శ్రీ భగవన్నామ సంకీర్తనము.

శ్లో॥ లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమాం।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరాం॥

శ్లో॥ నాహంవసామి వైకుంఠే నయోగిహృదయే రవౌ।
మద్భక్తా యత్రగాయంతి తత్ర తిష్ఠామి నారద॥

శ్లో॥ విష్ణోర్గానంచ నృత్యంచ పఠనంచ విశేషతః।
బ్రాహ్మణ్యం బ్రాహ్మణవర్ణానాం కర్తవ్యం హరికీర్తనం॥

శ్లో॥ శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణేర్జన్మాని కర్మాణిచ యాని లోకే। గీతాని నామాని తదర్థకాని గాయన్విలజ్జో విచరేదసంగః॥

౧. స్వాచార్యస్తుతి- నాటరాగము- త్రిపుట తాళము.

పల్లవి॥ శ్రీతిరుక్కురుంగుడి, జియ్యరుపాదకం। జాతములేనాగతీ॥

అనుపల్లవి॥ పాతకములదృంచీ, పామరులనెల్ల। పూతాత్ములజేసి, పుణ్యపథము జూపు॥ శ్రీతిరు॥

చరణము॥ రెండువేదాంతములు, మెండుగదెలసిన। పండితులిరుగడల, బారులై కొలువగ। నిండోలగంబుండి, కుండలిపతిరూప। మండితులౌ యతి స, మాప్టును చూపెడి॥ శ్రీతిరు॥ ౧॥

౨॥ కరుణతోడవేం। కటకృష్ణసంయమి। వరులు దయచేసిన, ప్రాప్తసర్వశ్రీకు। లురు వేంకటయోగి, వర నామధేయత। పరమోదారైకస్వ। భావులై వెలసిన॥ శ్రీతిరు॥

౩॥ దామెర్ల రాఘవ, దాసునిచేపట్టి। కామాదిషట్కము, కడద్రో-
చి ప్రేమతో। స్వామిత్వమును జూపి, సంస్కారపంచక। మా
మీదకృపజేసి, అరసిరక్షించిన॥ శ్రీతిరు॥

## ౨. కేశవాది చతుర్వింశతి నామ సంకీర్తనము.

బెహాగు రాగము- ఆది తాళము.

పల్లవి॥ మనమా హరిస్మర। ణను సేయవేవో॥ మనమా॥

అనుపల్లవి॥ అనుదినమును నీ। వత్యంతభక్తితో॥ మనమా॥

చరణము॥ మాధవ కేశవ, మధుసూదనా హరి। శ్రీధర వామన, శ్రీకృష్ణ
విష్ణోయని॥ మనమా॥

౨॥ నారాయణాచ్యుత, నారసింహోపేంద్ర। పురుషోత్తమాధో
క్షజ, వరపద్మనాభయని॥ మనమా॥

౩॥ గోవింద త్రివిక్రమ, దేవదేవానిరుద్ధ। పావన హృషీకేశ। వాసు
దేవయని॥ మనమా॥

౪॥ ప్రద్యుమ్న జనార్దన, రాఘవదాసావన। సద్యశ దామోదర।
సంకర్షణాయని॥ మనమా॥

## ౩. మానసబోధ- శ్యామకళ్యాణి రాగము- చాపుతాళము.

పల్లవి॥ మనమా శ్రీహరి, మరువకువేవో॥ మనమా॥

అనుపల్లవి॥ వనమున గృహమున, వనధులనుండిన॥ మనమా॥

చరణము॥ ధనకనకములను, ధాన్యములను జూచి। మనుట సతమనుచు,
మాయలబడివో॥ మనమా॥

౨॥ దారపుత్రాదులు, దంధననమ్మకు। తారకనామమె। తరణో
పాయము॥ మనమా॥

౩॥ ఎప్పుడు దలచిన, హితవునె గూర్చును। ముప్పున నిచ్చును, మో
క్షము సత్యము॥ మనమా॥

౪॥ దామెర్ల రాఘవ, దాసునిమాటలు। నీమముతోడుత, నెమరకు
డెచ్చుకో॥ మనమా॥

౪. శుద్ధసావేరిరాగము- ఖండజాతి- అటతాళము.

పల్లవి॥ ఓంనమోనారాయణాయయని, ఒక్కసారియైన ననవే మన
సా॥ ఓంనమో॥

అనుపల్లవి॥ స్నానసంధ్యాదికార్యములు, సర్వ సవనములు జపతపములు।
లోను గానవియెల్ల దీనికి, లోకువౌనుగా ననిది తెలసి॥ ఓంనమో॥

చరణము॥ ఘోరసంసారకూపములో, కూలివెలువడలేక జడులౌ । వా
రలెల్లను దీనిదలచుచు, నారకము తరియించిరనుచును॥

మిశ్రం॥ సారెకుసూరుల్వచించగను, చాల వినుచుండియున్ గనియున్।
కోరవేమె వెఱ్ఱిదానవయొ, ధీరు వీరరాఘవదాసావనుని॥ ఓం॥

౫. తోడిరాగము- అటతాళము.

పల్లవి॥ నారాయణచరణౌ శరణం ప్రపద్యే॥ నారా॥

అనుపల్లవి॥ వారణప్రహ్లాదభక్తౌ, పన్నివారణపరౌ శ్రీమ॥ న్నారా॥

చరణము॥ ఇందిరాపరిచితౌభక్త, మందారౌ సుందరౌ శ్రీ॥ నారా॥

౨॥ సూరిజనసంస్తవనపాత్రౌ, శోకదురితలతా లవిత్రౌ॥ నారా॥

౩॥ పాతకాగ్రణి వీరరాఘవ, భక్తపాలనచణౌ శ్రీమ॥ న్నారా॥

---

౬. కళ్యాణిరాగము- ఆదితాళము.

పల్లవి॥ శ్రీమతే నారాయణాయ, శ్రీనివాసగురవేహారమేనమో॥ శ్రీ॥

అనుపల్లవి॥ వామనాయ దామోదరాయ। వాలి రావణాది భంజనాయ।
సోమసూర్యలోచనాయ శ్రీమధు, సూదనాయ మాధవాయ
హాలినే॥ శ్రీమతే॥

చరణము॥ కేశవ గోవింద పద్మనాభ, కృష్ణవాసుదేవ భక్తవత్సల। శ్రీశ
శ్రీధర నృసింహ వరాహ, శేషశయన సామజరాజవరద। నా
శరహిత గుణదోషవర్జిత, నామరూపరహిత శ్రీద స్వప్ర। కా
శ నిష్కలంకరూప నిర్వి, కార మేరుధీర శూర వీర॥ మిశ్రం॥
పేశల ప్రద్యుమ్న పక్షివాహ, పీతవసనధారణ దేవ హృషీ।
కేశ వీరరాఘవదాసావన। క్షీరగిరినివాస తేనమోస్తు॥ శ్రీమతే॥

---

౭. తోడిరాగము- మధ్యతాళము.

పల్లవి॥ నారాయణచరణము। లేరా మన శరణము॥

అనుపల్లవి॥ వారిజాసనాది। వందితముళా॥ నారా॥
చరణము॥ పరమభక్తుడౌ। ప్రహ్లాదునేలిన॥ నారా॥
౨॥ కారుణ్యముతో। కరిగాచిన శ్రీమ॥ న్నారా॥
౩॥ కొంచమటుకులనుదిని। మంచి సిరుల నొసగిన॥ నారా॥
౪॥ సతి ద్రౌపదిమానము। సభగాపాడిన॥ నారా॥
౫॥ దామెర్ల రాఘవ। దాసావన శ్రీమ॥ న్నారా॥

---

## ౮. నాటకురంజి రాగము- ఆదితాళము.

పల్లవి॥ కరుణజూడరా। వరరఘువీరా॥ కరుణ॥
అనుపల్లవి॥ పరమపురుష రమా, పతి నిను వేడిన। వరములొసగవిది, వాద
టరా॥ కరుణ॥
చరణము॥ వేమారు మ్రొక్కిన, దామెర్ల రాఘవు। ప్రేమనేల విడేమి, వే
సమురా। శ్యామల క్షీరగిరి, ధామ శ్రీసీతారామ। తామరసా
క్షు నీ॥ మిశ్రం॥ మోమిటు జూపక, తామసపడియెద, వేమిర
సామిగ, నామనవిటుల విని॥ కరుణ॥

## ౯. కాంభోజిరాగము- ఆదితాళము

పల్లవి॥ పరలోకసాధనమే। వోమనసా॥ పర॥
అనుపల్లవి॥ స్థిరచిత్తముతో నర, హరి కరివరదా। శరణు కేశవరమా। వ
రయని వేడిన॥ పరలోక॥
చరణము॥ అక్రూరపాలక, అమరవందితపద। చక్రాయుధాచ్యుత, చం
చలనిభచేల। వక్రరహిత రఘు, వర కామజనక। శక్రాది స
న్నుత, నక్రమదహరణ॥ మిశ్రం॥ విక్రమజిత సుర, విరోధిస
ముదయ। శక్రమణిసకాశా రాఘవయ్యసవే॥ పరలోక॥

---

## ౧౦. కళ్యాణిరాగము- రూపకతాళము.

పల్లవి॥ నవజలధరదేహా శ్రీ। నాథా మాం పాహి॥ నవ॥
అనుపల్లవి॥ పవనతనయసేవిత మాం। పాహిపాహి తే నమో నమో॥ న॥
చరణము॥ నారాయణ నినె నమ్మితి, నాకాధిపేంద్రవినుత। రారా నను
దయజూడను, రాధాకేళీలోల। వేరెవ్వరి నేవేడను, వేణురవా
మోదవ్రజ। తారాధిపసదృశవదన, దామెర్లరాఘవపాల॥ న॥

---

౧౧. కమాంచిరాగము- ఆదితాళము.

పల్లవి॥ నేరామేమీరా చెప్పరా, నీరేజాక్షా నా॥ నేరా॥

అనుపల్లవి॥ కారణంబులేని కోపమేలర, కరుణించనుసమయమిపుడ నాయె డ॥ నేరామేమీరా॥

చరణము॥ నారాయణా దామోదరా। నరసఖ కంసుభధర। పరమపురుష భవహార భవనుతనీ। చరణకమలపరిచారకుడనునా॥ నే॥ ౧॥

౨॥ ఎంతవేడిన నాపై కా, సింత కరుగదురనీ। దెంతకఠినహృదయముగా యిక నా, చింతదీర్చి చెంతజేర్చి బ్రోవర॥ నేరా॥

౩॥ ప్రేమతోబ్రోవకను, తామసపడుటేది నీ। నామమునకు లోపముగద యిపుడై, నా నన్నుకరుణించర రాఘవ॥ నేరా॥

---

౧౨॥ బిలాహరీరాగము- రూపకతాళము.

పల్లవి॥ నిన్నేనమ్మినారా। నీరేజపత్రేక్షణ॥ నిన్నే॥

అనుపల్లవి॥ కన్నతండ్రివని, కరుణతో బ్రోతువని। నన్నుతాంగ నీకన్న వే, రెన్నక నేనెన్నడును॥ నిన్నే॥

చరణము॥ కామజనక శ్రీ। కర కరుణాకర। దామెర్ల పీర రాఘవ, దాసపోషక శౌరి॥ నిన్నే॥ ౧॥

---

౧౩. నవరోజు రాగము- ధ్రువతాళము.

పల్లవి॥ నను కరుణించవు, న్యాయమటర। కనికరమున నను గనుగొని హరి॥ నను॥

చరణము॥ పరిమళరంగపతి మాధవ। భానుశతకోటిప్రభ శ్రీహరి॥ న॥ ౧॥

౨॥ కామితమొసగుముకనకచేల। దామెర్ల రాఘవుదయనేలుము॥ న॥

---

౧౪. జంఝూటీ రాగము- ఆదితాళము.

పల్లవి॥ కావవే నీవు, కరివరదాననను॥ కావవే॥

అనుపల్లవి॥ పావననిన్ను నే, పలుమరు వేడిన। పలుకకుండేది నా, పాపమా శ్రీహరి॥ కావవే॥

చరణము॥ సామిగ నినుమది, పేర్చునిల్పినవాడ। దామెర్ల రాఘవ, దాసుడ శ్రీహరి॥ కావవే॥ ౧॥

౧౫. ఫరజురాగము- ఏకతాళము.

పల్లవి. రక్షించ సమయము|వో| పక్షివాహ స్వామి, పక్షముంచి వేగ|| ర||

చరణము. ఘోర సంసారాబ్ధి కోజికి| దారిగానలేక, తల్లడమొందితి|| ర||

౨|| నీచుడను పాపిని మీ| శ్రీచరణముల, సేవకృప జేసి|| రక్షించ||

౩|| దాసానుదాసునిగా దయ | జేసి ప్రేమమీర, శ్రీవీర రాఘవ|| ర||

---

౧౬. బేగడారాగము- రూపక తాళము.

పల్లవి. ఎందు వెందు వెదకిన నీ, వందె యుండెయుండువనుచు| అందరం దురందుకునను, సందియమొందింపకయ్యా|| యెం||

చరణము. ఇందిరేశ సుందరాంగ, వందారు మందార | నందనందనా హరి ముచ్చి, కుందవరద కుందసురద|| యెం||

౨|| చరములందు స్థిరములందు, తరుణులందు పురుషులందు | సుర కిన్నర సిద్ధసాధ్య, గరుడోరగ ఖచరులందు|| యెం||

౩|| గోవులు భూదేవులు తుల, సీ వనములు దేవళములు | పావన ములు భక్త రాఘ, వావనములు వానియందు|| యెం||

౧౭. శంకరాభరణరాగము. రూపక తాళము.

పల్లవి. నిన్ను బొగడ నెంతవాడ, నీచుండను నారాయణ|| నిన్ను||

అనుపల్లవి. అన్ని లోకములనేలు, నన్ను తానంత మహిమ|| నిన్ను||

చరణము. వేదంబులు వేదశిఖలు, నీదు మహిమ బొగడలేక| పేదలై మరలు చుండ| నేదిదిక్కు నాబోంట్లకు|| నిన్ను||

౨|| హరచతుర్ముఖ ముఖాది, పురుషులె నినుబొగడలేక | కరము సి గ్గుబడుచునుండ, మరి యితరుల జెప్పనేల|| నిన్ను||

౩|| పిల్లల మాటలకు తండ్రి, తల్లులుల్లసిల్లునటుల| కల్లలైన నాపలు కుల, నెల్లగొనుము రాఘవేంద్ర|| నిన్ను||

---

౧౮. బిలహరిరాగము. చాపుతాళము.

పల్లవి. నరకాసుర భంజనా, త్వాం నమామి, నలినాయతలోచనా||

అనుపల్లవి. పరమహంస మునీంద్రగణసుర, పాదపా, వేదపా- రాయణా శౌరి నా- మనమునను వీడబాయదగునా|| నరకా||

ము॥ మందహాసనీలాంబుదరూపా, మంత్రిసారా విగతపాపా। సుం
దర వదనా, కుందరదన। బృందావన మానిబృంద నిధానా॥
మి॥ పందెములనికమానురా, వందనములివిగోనురా। పొందు
గా వీరరాఘవుని, పోషించరా భాషించరా॥ నరకా॥

౧౯. కమాచిరాగము. ఆదితాళము.

పల్లవి. కరుణించసమయమిపుడె బ్రోవరా, కనకచేల నను॥ కరు॥

అనుపల్లవి. ఖిరానబ్రోవక, నిరాకరించిన। పెరదైవముల వేడనీతోడూ॥ క॥

చరణము. సా- రేకు నీపదయుగళమె నా, శరణమనుచు నమ్మితి। వేరుసే
యమేరగాదు హరి కం- సారి చీర చేరరార నను॥ కరు॥

౨॥ సా- మిగ నీమముతోడుత నీ। నామమె మది దలచితినీ। పామరు
డను నను గనుమీ। సామజవరదా॥ కరు॥

౩॥ పంకజసంభవాదినుతమీ। నాంకజనక రాఘవ। శంకరపేట శ్రీ,
సత్యనారాయణ। కింకరుడనన్ను కృపతో జూచీ॥ కరుణించ॥

---

౨౦. భైరవిరాగము. త్రిపుటతాళము.

పల్లవి. నిన్నుకీర్తించు యీనోట నేనితరుల। సన్నుతిసేయనురా॥

అనుపల్లవి. ఎన్నడైనగలదా, యేనుగపైనెక్కి। కన్నములో దూర, కర్మ
మా శ్రీహరి॥ నిన్ను॥

చరణము. హెచ్చైన అమృతము, యింటిలోనుండగ। పచ్చినీరుదాగ, ప
నియేమిరాసామి। కచ్చలోబంగారు, కడవోవికాసుకు। బిచ్చ
మెత్తనెవడు ప్రేమించురాహరి॥ నిన్ను॥

౨॥ పంచభక్ష్యపర, మాన్నములుండగ। పాసిన కూడది, పనియే
మిభక్షింప। పంచశరునిగన్న, పరమపురుష నిన్ను। పలుమారు
వేడుచు, పాడుచు నాడుచు॥ నిన్ను॥

౩॥ పరమపదము వేడ, కరుణింతువు నీవు। పరదైవము లిచ్చు, ఫల
ములస్థిరములు। నరులనుబాడుట, నాశనహేతువు। వర వైశా
ఖపుర ని, వాస శ్రీవేంకటేశ॥ నిన్ను॥

౨౧. సావేరిరాగము. ఆదితాళము.

పల్లవి. శ్రీసింహశైల నాథననునీ। సేవకునిగ నేలుకొనుము మ్రొక్కెద॥ శ్రీ॥

అనుపల్లవి. ఆసతోడ నిన్నుజేరి వేడగ। నీసడించన్యాయమటరనికిది । వా
వాదివందితపదపంకజ। వారాహంలక్ష్మీనరసింహా॥ శ్రీసింహా॥

చరణము. మునురకశిపుడు తను కడునార్తిని। బోధ్రమనుచు నిన్ను వేడ
మనమున కనికరముదయించగ బిరబిరసా। క్షాత్కారమొంది
తివటయుటహరి॥ శ్రీసింహా॥

౨॥ కుందబృందమందమొందు దేహము। మందహాసమిందుసుందరా
నన। మందరిందు సేవించుటకైతగ । పొందుపడితి విందిరాధవా
హరి॥ శ్రీసింహా॥

3॥ వేడవేడనాపై జాలిజెందు। నేడునాదు స్వప్నమందునీదయతో
డదర్శనమొసగితివి నీక్షే వేడ గానరాదు రాఘవావన ॥ శ్రీసిం
హశైలనాథ ననునీ। సేవకనిగ నేలుకొంటివిరిభళి॥ శ్రీసింహా॥

---

౨౨. తోడిరాగము. ఆదితాళము.

పల్లవి. శ్రీరాజాగోపాలా నిన్నే, సేవింతునామనమున॥

అనుపల్లవి. కోరికలొసగి యేలుకొమ్మా నమ్మాకమిమ్మా॥ శ్రీరాజా॥

చరణము. శ్రీమీరవిజయనగర, సేవ్యుడవై వెలసిన। రామకళ్యాణగుణ,ధా
మ తారకనామ॥ శ్రీరాజా॥ ౧॥

౨॥ దామెర్ల వేంకటరాయు। ప్రేమనేలి తత్సుతుని। కామితమొస
గు పూర్ణకామా కామవిరామ॥ శ్రీరాజా॥

---

౨౩. బిళహరీరాగము. జుల్వతాళము.

పల్లవి. వేంకటేశునిగొలువ। సంకటములుదీరునే॥

అనుపల్లవి. పంకజనయనుని శ్రీహరి॥

చరణము. నూటెనిమిది తిరపతులలో, నేమైన శేషశిఖరి। కోటిజనులు గొ
లుచుచుండ, కొలువైయుండెడి శ్రీహరి॥ వేంకటే॥

౨. శాంతిబూనిదాసజనుల, పంతముమీర కరుణగన్గొని । సంతత
మును తిరపతిని యనంతుడై వెలయు రాఘవుని॥ వేంకటే॥

---

౨౪. పంతువరాళిరాగము. ఏకతాళము.

పల్లవి. దయలేదుగదా, నాపైని నీకు॥ దయలేదు॥

అనుపల్లవి. తరుణశశివతంస వందితపాద॥ దయలేదు॥
చరణము. పిలచి పిలచి విసికి వేసరిల్లితి। పలుకవేమి పంకజాక్ష శ్రీహరి॥ ద॥
౨. పతితుడనని వీడనాడజూచెదో। పతితపావనత్వమెచట దాచితివు॥
౩. జాలమేల తాళజాలనే నీ। పాలబడితి నేలుకొనుము రాఘవ॥ ద॥

---

౨౫. దేవక్రియ రాగము. ఆదితాళము.

పల్లవి. బ్రోవరావిదితగునా। రామయ్యా రాను నను॥ బ్రోవరా॥
అనుపల్లవి. సావకాశముగానిన్। సన్నుతి సేయగ। కావకపోవుట। కారాదురా నా వినీ॥ బ్రోవ॥
చరణము. అనుదినమునునిన్, మునుకొని పూజసేయ। వనరుహములవలె, దనరు నేత్రాల। ననుగనుగొన నా, మనమున మోదము। జెనగొన రాఘవాఖ్య। డనుమనవిని చెల్పిన॥ బ్రోవరావిది॥

---

౨౬. తోడిరాగము. రూపకతాళము.

పల్లవి. నారాయణ నారాయణ నారాయణ రారా॥
అనుపల్లవి. ఏరానను దయజూడవి, దేరా మోహనాకార॥ నా॥
చరణము. సామగానలోల నిన్నే, చాల నమ్మినారా। హేమచేల తడవిదేల। యేలుకొనవి దేరా సామి॥ మిత్రం॥ రామాయని వేడిన నీ। మోముజూపవేరా। తామరసనయన రాఘవ, దాసపోష శేషశయన॥ నా॥

---

౨౭. సురటురాగము. ఆదితాళము.

పల్లవి. దీనశరణ్యా। దేవదేవవో॥ దీ॥ అ॥ మానకనీసేవ, మరిమరి జేసిన। గాని నాపైని నీ, కరుణరాదేమె వో॥ దీన॥
చరణము. రక్కసితమ్ముడు, మ్రొక్కినమాత్రనే। పెక్కుసిరులిడిన, ప్రేమ నాపైనే దేవా॥ దీన॥ ౧॥
౨॥ పతితుల బ్రోచుట, పనిగల నీకు నన్। ప్రతిపాలించుట, భారమైతోచెనావో॥ దీన॥
౩॥ పామరుడైన యీ। దామెర్ల రాఘవు। ప్రేమ నేలుకొనుమా। వోమహానుభావ॥ దీన॥

---

౨౮. శ్యామకళ్యాణి రాగము. చాపుతాళము.

పల్లవి. ఇంతకఠినహృదయమయిన। దెరుగనైతినో హరీ॥ యింత॥

అనుపల్లవి. సంతతమును నిన్ను నేదలంతునా ప్రార్థింతునా॥ యింత॥

చరణము. మున్నుకరినిగాచితివని, విన్నమాటలానుపట్టి । యిన్నిదినములో యెనిన్ను। సన్నుతులు జేసితిగాని॥ యింత॥ ౧॥

౨॥ పాపములను బాపుదువని, ప్రాపుగోరి యున్న నన్ను । రాపుసేయుటెల్ల నీ। కోపమా నాపాపమా॥ యింత॥

౩॥ ధరణిలో దామెర్ల వేంకట, దాసునిపుడు బ్రోవకున్న । పరువుదలతురేమినీవు। పరమపదనివాసుడవయిన॥ యింత॥

---

౨౯. గత్తు. నాదరామక్రియరాగము. ఏకతాళము.

పల్లవి. రక్షించుశ్రీహరి రక్షించు। హరిననురక్షించు। కరుణనురక్షించు। వేగమె రక్షించు। శ్రీహరిరక్షించు॥

అనుపల్లవి. పక్షపాతమెందుకురా హరి నను॥ రక్షించు॥

చరణము. చపలుడ హీనుడ అపరాధిని నను ॥ రక్షించు॥ ౧॥

౨॥ రాతిని నాతిని కోతిని ఖ్యాతిగ, ప్రీతితోడరక్షించవెనన్నటు॥ ర॥

౩॥ శరణనువారిని కరుణనుబ్రోచెటి। బిరుదు పరమపురుష వరద మరువక॥ ర॥

౪॥ గజరాజును ప్రహ్లాదును బ్రోచిన, కనికరంబు నాపై జూపకనిటు। అజహరాదివందిత నన్నేచుట। అన్యాయమన్యాయ మిక నను॥ రక్షించు॥

౫॥ పామరుడను క్రూరుడ దుర్మార్గుడ। పాపినెందుబోయి వెదకిన ను నను। ప్రేమమీర బ్రోచువారు నీకం। టే మరెవ్వ రంబుజాక్ష వేగమె॥ రక్షించు॥

౬॥ దామెర రాఘవదాసుడ మొరాలకితి। తప్పులెంచ మేరగాదు శ్రీహరి॥ రక్షించు॥

౭॥ దాసునితప్పులు, దండంబున సరి॥ రక్షించు॥

---

౩౦. కళ్యాణిరాగము. చాపుతాళము.

పల్లవి. ఎప్పుడు బిలచిన, మేలనోకోరావు॥ మె॥

అనుపల్లవి. ఒప్పులకుప్పమా। యప్పతప్పేమిర॥ మె॥

చరణము. బంగరుబొమ్మ శ్రీ, పద్మ నిన్నుగూడి। కౌంగలించి యెటు, కడ లనీయకేమొ॥ యె॥ ౧॥

౨॥ భూమిదేవి నిను, పొందుగాగూడి। కాముకేళిదేల, నామొర వినవా॥ యె॥

౩॥ నీలనిన్నుగూడి, కేళిదేలుచుండ। పాలుమాలితివా, పరాకుబడితివా॥ యె॥

౪॥ దామెర రాఘవ, దాసుని నన్నేల। సామి యింతజాల, మేమి నారాయణ॥ యెప్పుడు॥

---

ఏకప్రాసకీర్తనలు.

---

౩౧. దర్బారు రాగము. ఆదితాళము.

పల్లవి. పిలచినకోపమా, ప్రేమమీరనిన్ను నేను॥ పిలచిన॥

అనుపల్లవి. అలుకలెందుకునాపై, ఆదిదేవ రంగేశా॥ పిల॥

చరణము. జలరుహములబోలు, చరణములను నేను। వలగొని సేవసేయ, వాంఛించి పలుమరు॥ పిలచిన॥ ౧॥

౨॥ మొలకనవ్వులముద్దు, మోము నేనుజూడగోరి। పలుమారు వేడితే, పల్కవేమిరాసామీ॥ పిలచిన॥

౩॥ చలమేలరా నాపై, చాలమ్రొక్కినాగాని। అలరువిల్తుని గన్న, అంబుజాక్షు రాఘవేంద్రా॥ పిలచిన॥

౩౨. సావేరీ రాగము. ఆదితాళము.

పల్లవి. పాదారవిందములె గతియనుచు, పరమపురుష సతతము నమ్మితినీ॥ పాదార॥

అనుపల్లవి. భేదమెంచ మేరగాదునను నీ, వాదరించకున్న నెవరు దిక్కెలవాదమేల నేనినువిడువనికను, నీదుచిత్తమటుపైనాభాగ్యము॥ పా॥

చరణము. ఖేదమోదముల వలలో దగలిచి, భేదవాదముల భ్రమ గలుగజేసి। నీదుపాదభక్తిని మరపించుట, కాదుకాదు నీఘనతకుతగుపని॥ మిత్రం॥ నాదుమనవి వినరాద దయలేద, కాదసమయమిప్పు

డు నన్నుబ్రోవను। వేదవేద్యాజాలమేల తాళగ, రాదురా, రా ఘవా, వనా నీ॥ పా॥

### ౩౩. ఆరభిరాగము. ఆది తాళము.

పల్లవి. సారంబులేనిసంసార, వారిధిలో ననుబారవైచి। తేరకాని బ్రోలె నూరకుండుట, మేరగాదురా పరమాత్మ॥ సారంబు॥

చరణము. నారంబునీకు తానకంబట, నారంబునకునీవు స్థానమట। నారాయణుడపట కారుణ్యము, నైసర్గికంబట నాధనాధ॥ మిశ్రం॥ నారసింహ కేశవ దామోదర, మారజనక మాధవ మధుసూదన। వారిజాక్ష పద్మనాభ శ్రీధర। పరాత్పరా, రమావరా, రఘువర॥ సారంబు॥

### ౩౪. హిందుస్తానీ భైరవిరాగము. ఆదితాళము.

పల్లవి. ఏమిజేసినాను। రామనేరము నేను॥ ఏమి॥

అనుపల్లవి. సామినిన్నెగోరీ, చాల వేడితీగాని॥ ఏమి॥

చరణము. మోమెత్తిచూడవు, ముచ్చటలాడవు। వేమారు బిలువ నీ, వేను యిటురావు॥ ఏమి॥

౨॥ మోమాటమూలేక, నామీదకోపమా। యేమిరా యీరీతి, యేనాటినీతిరా॥ ఏమి॥

౩. దాషర్థిరాఘవ, దాసునిప్రేమబ్రోవ। తామసమేలరా। తగదురనీకిది॥ ఏమిజేసి॥

### ౩౫. బిళాహురీరాగము. త్రిపుటతాళము.

పల్లవి. ఎంతవేడినాగాని, పంతమేలరాసామి। సుంత మోము జూప నీ, సొమ్మేమిపోనురా ని॥ న్నెంతవేడినా॥

చరణము. చింతలెల్లదీర్చినన్, చేరదీయవేమిరా। యింతకోపమేల నే, నేమిజేసినానురా ని॥ న్నెంత॥

౨॥ దంతిరక్షకా నను, సంతరించుటెల్ల నీ। కెంతమాత్ర మిందుకు యేలమందెమేలము ని॥ న్నెంత॥

౩॥ రంతులేలజేసేవు, రామరామ దీనుడన్। వింతచూపుజూడకు, వీరరాఘవార్చితా ని॥ న్నెంత॥

### ౩౬. హిందుస్తానీ భైరవి రాగము.

పల్లవి. కరుణించరావదేమిసామి, కనికరములేదా॥

అనుపల్లవి. శరణన్నబ్రోవకున్ననీకు, జగతి నపవాదా। హరి॥ కరు॥

చరణము. పరమాత్మ వేడుకున్న నాతో పల్కవేమిరా। కరుణించసమయ
మిపుడు నాపై। కాంక్షయేలరా। హరి॥ కరు॥ ౧॥

౨॥ శరణన్న విభీషణుని ప్రేమ, సంతరించవా। హర్షించి ద్రౌపదికి
ని మాన, హానియుడుపవా। హరి॥ కరు॥

౩॥ కరిరాజుగాసిజెంద మకరి, శిరముద్రుంచవా। వర భక్తుడైన ప్ర
హ్లాదు, వాంఛలొసగవా। హరి॥ కరు॥

౪॥ రారా దామెర్ల వీర, రాఘవార్చితా, నా। కోరికల నొసంగ
మేలుకొనవె యచ్యుతా। హరి॥ కరు॥

---

### ౩౭. యమునాకళ్యాణి రాగము. జాతిస్వరం- యేకకం- ఏకతాళము-

పల్లవి. వారిజాక్షమాధవనే। కోరినకోరికలీరా మేరుధీర॥ వారి॥

చరణము. గారడంబులేలర నా। నేరములేరుట మేరా ధరోద్ధార॥ వా॥

౨॥ వేరుసేయబోకురసన్। సారెసారె యూరకుర చేరరార॥ వారి॥

౩॥ వీరరాఘవార్చిత సం। సారపారావారోద్ధార మారాకార॥
వారిజాక్ష మాధవ నే॥

---

### ౩౮. బెహాగు రాగము. ఏకతాళము.

పల్లవి. నారాయణానిను, ననుదినమును వేడ । గారవించి నను, కనికర
మున జూడవదేర సామి॥ నా॥

అనుపల్లవి. ఆరసి యా ప్రహ్లాదు నహల్యను। వారణరాజును వరుసనేలితే।
మేరీ నీసరియెందైనగలరె। కోరిభజించినకొంగుబంగారట॥ నా॥

చరణము. మారాకారా మాటలాడవదేర। క్రూరచిత్తుడనని, కోపంబట
రా। సారెకునిను నే సన్నుతిసేయగ। నూరకుంట నీ॥ మిత్ర॥ ఉ
చితంబటరా నుచికుందవరద। సచరాచరముల సదయముబ్రో
తువు। విచలాత్మకుడగు, వీరరాఘవుని। ప్రచురమగుదయను, పా
లించవేర॥ నారా॥

## కఠిన తాళములు.

---

### ౩౯. కళ్యాణిరాగము. కురుజంపెతాళము.

పల్లవి. శ్రీజానకీరమణ। శ్రితజనావననిపుణ। రాజారిమదహరణ। రాజీ
వదళనయన॥ శ్రీజానకీ॥

చరణము. కోమలారుణచరణ। కుమతిసంహారణచణ।స్వామిన్ విహార మమ
చ। స్వాంతేనిశంముదా। దామెర్ల రాఘవం। తారయసుధీరమ
ణ। రామసద్గుణగణో। ద్దామ తారకనామ॥ శ్రీజానకీ॥

---

### ౪౦. బిళాహరిరాగము. ఖండజాతి మటిమతాళము- చాపు.

పల్లవి. శ్రీరామామరపూజిత పాదకమలయుగ పాలయ। కారుణ్యా
బ్ధే పూర్ణచంద్రవదనా మాం॥ శ్రీ॥

చరణము. సాకేతాధిప సరససుగుణ ఖలదనుజవిరామ। కాకుత్థాన్వయ
వార్ధిసోమ కమలానాధ॥ శ్రీ॥ ౧॥

౨॥ కుందసుందరరదన మమ హృన్మందిరే సదా। ఇందిరేశ సునివ
స సేవకబృందమందార॥ శ్రీ॥

౩॥ హరకోదండవిఖండనచణ హరిహయాది సేవిత। శరణమేమి దా
మెర్ల వీరరాఘవ దాసోహం॥ శ్రీ॥

---

### ౪౧. కళ్యాణిరాగము- త్రిశ్రజాతి మటిమతాళము.

ల్లవి. శ్రీరమాలోల కూరజనకాల।సారతమశీల।సూరిగణపాల॥ శ్రీ॥

రణము. నారదాదినుత। కారుణ్యచరిత। నారాయణ సిత। వారిరుహానే
త్ర॥ శ్రీరమాలోల॥

---

### ౪౨. ముఖారిరాగము. త్రిశ్రజాతి ధ్రువతాళము.

పల్లవి. కనికరములేక నన్ను। కష్టపెట్టమేరా॥

అనుపల్లవి. మనవిజేసినాగాని। మాటాడవేరా॥ కనికరము॥

చరణము. వీరరాఘవదాసుని। వేడ్కబ్రోవవేరా। రార వైశాఖపుర। ర
మ్య సీతారామ॥ కనికరము॥

---

## ౪౩. తోడిరాగము- సప్తతాళములు-

ప॥ త్రిపుట॥ అంజనీతనయ నిను వేడన। న్నాదరించవేర సామి నేరమేమి
దెల్పుమివేగ॥ నంజనీ॥

చ ౧॥ ఆది॥ వారధిలంఘించి। వనపాలకులదు్రించి। శ్రీరాముల మది కం,
జిల్లజేసిన తండ్రి వో॥ అంజనీ॥

చ ౨॥ రూపక॥ సీతాపతిచరణాంబుజ। సేవామృత పాన లోల। పాతకము
లదు్రించి నన్ను। పాలించుము సుగుణమణిఖనీ॥ అంజనీ॥

చ ౩॥ ధు్రవ॥ ధరణిజాతపరమాప్తా నీ। సురుచిరమగురూపము నేనిపు। డ
రయ గోరితిని నామో్రలకు॥ మిశ్ర॥ నరుగుదెంచి కరుణజూ
చివెరపుదీర్చి వరములిచ్చిబో్రవుము శ్రీ॥ అంజనీ॥

చ ౪॥ మత్స్య॥ కరుణాకర నేనీ। చరణము లేగతియని। శరణంటిని కాపా
ర నేనారులవేడరా॥ అంజనీ॥

చ ౫॥ జంపె॥ ఆసించి నినువేడ। నభిమానమేలేక। యీసడించినను నీ। కీధిచు
లకదనముగద శ్రీ॥ అంజనీ॥

చ ౬॥ ఖండ। శ్రీరామపాదారవింద। సేవకాధముడౌ దామెర్ల। వీరరాఘ
జాతి అట॥ వు నేలనీకిది। విన్నాణమయిన తరిగదర॥ అంజనీతనయ॥

---

### శ్రీమహాలక్ష్మిస్తుతి కీర్తనలు.

---

## ౪౪. సింధుకన్నడా రాగము- ఏకతాళము.

పల్లవి. కన్నతల్లి వేగ, కరుణజూడవే॥ అ॥ మన్ననతో నీ, మగనితోడ జె
ల్పి నన్॥ గన్న॥

చరణము. తప్పులెన్నియున్న, నొప్పుసేయవే। అప్పకోపగింప। నాదరించ
వే॥ కన్నతల్లి॥ ౧॥

౨॥ రామరామ యింత, రవ్వలేలనే। పామరుండనాపై। పక్షముం
చవే॥ కన్న॥

౩॥ ఆశతోడనుంటి। మోసపుచ్చకే। శ్రీశురాణినా। దోసమెంచకే॥ క॥

౪॥ ఎంతోవేడుకున్న। పంతమేలనే। నా। చింతదీర్చినను। చేరదీయ
వే॥ కన్న॥

౫॥ వీరరాఘవుని, వేగబ్రోవవే, కూరిమితో వాని [illegible]

### ౪౫. శ్రీరాగము. రూపకము.

పల్లవి. తల్లినీవు పేక్షసేయ, తండ్రికెటుల నెనరుగలుగు॥

అనుపల్లవి. పిల్లలపై జాలిగొనుట, తల్లులదే నన్ను గన్న॥ తల్లి॥

చరణము. కల్లలాడినైన గాని। పిల్లలనేరములు దాచి। వల్లబూచి మగనితోడ। మెల్లగా శిఫార్సు సేయు॥ తల్లి॥

౨॥ కడలి పరమపదమువిడచి। బుధుతల రక్షించుకొరకు। పుడమిని శ్రీరంగముననుl ఒడయునితో వెలసినట్టి॥ తల్లి॥

౩॥ పతితుడనని నన్నువిడువ। పాడియె నీచరణకమల। పతితుని రాఘవుని సుతుని- భాతి బ్రోవవలెను గాని॥ తల్లి॥

---

### ౪౬. శంకరాభరణము. రూపకము.

పల్లవి. పాలకడలిపట్టినాదు। భయముబాపవే॥ పాల॥

అనుపల్లవి. చాల నేరములు జేసితి। శరణుశరణు క్షమాజలధి॥ పాల॥

చరణము. బాలురు నేరములుసేయ। భయము జెప్పుదురుగాని। యీలాగు నవిడుతురటవె। మొచటనయినకన్నతల్లి॥ మిత్రం॥ జాలంబేలను యికన। న్నేలుటకిదియేసమయము। నీలవర్ణుముద్దుగుమ్మ। నీసుతుండగానటమ్మ॥ పాలకడలి॥

### ౪౭. సురట రాగము. అటతాళము.

పల్లవి. శ్రీశ్రియఃపతికిని, శ్రీభూనీళలకును మంగళం శుభమంగళం॥

అనుపల్లవి. ఆశ్రితపోషణదీక్షాతత్పరులకు మంగళం జయమంగళం॥ శ్రీ॥

చరణము. అనంతగరుడ విష్వక్సేనులకును మంగళం శుభమంగళం।
సానందముగనుండు సుదర్శనులకును మంగళంజయమంగళం॥ శ్రీ॥

౨॥ చండాదిద్వారపాలకసంఘమునకును మంగళం శుభ మంగళం।
నిండుకొలువునుండు నిత్యసూరులకు మంగళంజయమంగళం॥ శ్రీ॥

౩॥ పరాంకుశ పరకాలాదులకును మంగళం శుభ మంగళం।
పరమభక్తిని యతివరస్వాచార్యులకునుమంగళంజయమంగళం॥

౪॥ పరమపదమునందు వేంచేసియుందునాచాలగోపాలముకు మం

శం॥ ధరవీరరాఘువ దాసపో  తు మంగళంజయమంగళం॥

---

### ౪౮. ఆఠాణారాగము. ఆది తాళము.

పల్లవి. శ్రీమ రాయణునకు లక్ష్మీ। భామామణికిని మంగళం॥

అనుపల్లవి. కామజనకునకు కమలకు శ్యామల। గాత్రునకును కమలా
త్యము॥ శ్రీమన్నారాయణు॥

చరణము. నారదనుతునకు, నారదవేణికి, వారణత్రాతకు మంగళం।
మారజననికిని మంగళకరునకు, సారసముఖికిని మంగళం॥ శ్రీ॥

౨॥ ఆదిశేషునకు గరుడునకాళ్వా, రాదులకును శుభమంగళం।
సాదరమతులై భక్తులబ్రోచెడి సంయమివరులకుమంగళం॥ శ్రీ॥

౩॥ దామెర్ల వీరరాఘవ దాసుని, తరింపజేసేటందుకై। శ్రీమీరగ
శ్రీరంగపురమునను, సేవ గలుగజేయనవతరించిన॥ శ్రీ॥

### ౪౯. ధన్యాసిరాగము. ఆదితాళము.

పల్లవి. పవళించవయ్యా, పరమపురుషా హరీ॥ పవ॥

అనుపల్లవి. యువతులిరుగడల, నూడిగముసలుప। సవతులేని ప్రాభవ మ
లరగనీవు॥ పవ॥

చరణము. కమల నీచరణ, కమలములొత్తగ। శ్రమమెడల ఫాదు, శారీతి
ని నీవు॥ పవ॥

౨॥ నీలమడుపుల, నివ్వగ వేడుక। చాలనారదుడు, సంగీతము బా
డ॥ పవ॥

౩॥ భాసమాన రంగమందిరాంగణ। వాస వీరరాఘవదాస పోష
కా॥ పవళించవయ్యా॥

---

### ౫౦. శహానారాగము. ఆదితాళము.

పల్లవి. జోలాబాడీన యీజాల, మేలా శ్రీలక్ష్మీలోల॥

అనుపల్లవి. చాలాప్రొద్దుబోయెను। లీలానిదురించవేల॥ జోలా॥

చరణము. భక్తపాలనముజేసి, ప్రణతులుగొన్ననిన్ను। ముక్తాహారములు
గల, ముద్దుతొట్లలోనుంచి॥ జోలా॥

౨॥ సకలలోకములను, సంరక్షణముజేసి। అకలంకకీర్తి,
న నిన్ను లాలించి॥ జోలా॥

౩॥ దామెర్ల వీరరాఘవ, దాసునితోడగూడి। ప్రేమమీరగ నాడి,
ప్రియము లొసగితివిగద॥ జోలా॥

---

౫౧. సురటురాగము. ఆదితాళము.

పల్లవి. లాలీ శ్రీమన్నారాయణా। భక్తరక్షణ। శీల సుందరచరణ। క
ళ్యాణసుగుణ॥ లాలీ॥

అనుపల్లవి. లాలీ శ్రీభూమీనీలా। లోలా రాక్షసనిచయ। కాలా సజ్జనపా
ల। నీలవర్ణ వనమాలి॥ లాలీ॥

చరణము. రవ్వ సేయక పవళించు। నీకుబంగారు। మువ్వలపేరుజేయింతు।
కాళ్లకుమంచి। రవ్వలందియలు నేనుంతు॥ ఇవ్వేళ నీకు పాలు।
బువ్వతెమ్మ నేవు యిది। మెవ్వారు విన్నాగాని। నవ్విపోరా నా
తండ్రి॥ లాలీ॥ ౧॥

౨॥ నన్నుగన్నయ్యాబజ్జోరా। బూచీవచ్చేరా। అన్నా అల్లర మాన
రా। యెంతవూచీనా। వెన్నుడ కింకయేలరా॥ కన్నెలతోడ పొ
న్న। గున్నల దరిని లేత, వెన్నెలలో నాడితి। వింకా చాలదా
శౌరి॥ లాలీ॥

౩॥ దామెర్ల వీరరాఘవ। దాసునేలిన। కామజనక మాధవ। లీలా
వినోద। కామాదివైరిసంహారా॥ నామాట వినవా విజయ। నగ
రి హుకుముపేట। శ్రీమీర వెలసినట్టి। శ్రీశౌరాజగోపాల॥లాలీ॥

---

౫౨. భూపాళరాగము. త్రిపుటతాళము.

౧. మేలుకొనుశ్రీరంగనాయక। మేలుకొనుముక్తిప్రదాయక। మేలుకొ
నుబ్రహ్మాండనాయక।మేలుకొనవయ్యా॥ రంగా మేలుకొనవయ్యా॥

౨. తెల్లవారగవచ్చె దివ్వెలు। తెల్లబారెను తారహారము। లెల్లచల్లగ
నాయె పవనుడు। చల్లగావీచెన్॥ రంగా॥

౩. చుక్కబొడిచెను తామ్రచూడము।కొక్కొరోయనికూయసాగెను।
పక్కిగుంపులరొదలుచెలగెను। భవ్యమేలుకొనరే॥ రంగా॥

౪. తమ్మిలెల్లను బూయసాగెను। తుమ్మెదలు ఝుమ్మనుచు మోగిసె

...॥ కమ్మవిల్తుని తండ్రి లోకము। గావ మేల్కొనరే॥ రంగా॥

౫. వేదవేత్తలు బ్రాహ్మణులు కా, వేరి జలముల గ్రింక యర్ఘ్యము। సాదరముగా నిచ్చుచుండిరి। స్వామి మేలకొనరే॥ రంగా॥

౬. దివిపురందర హరముఖాఖిల। దేవగణములు నుతులు సల్పుచు। అవసరముకై వేచియున్నా। రయ్య మేల్కొనరే॥ రంగా॥

౭. హేమకలశసుగంధజలవ... స్వామ్ముల మరిచియుంచిరిదిగో। స్వామిలీలాదంతధావన। స... మవ్యేన్॥ రంగా॥

౮. భానుడుదయంబాయె భ... లు। మానుగా కైంకర్యలోలత। దీనలై కని పెట్టియుండిరి। దేవ మేలకొనరే॥ రంగా॥

౯. కామధేనువు గజమునశ్వము। స్వామిప్రాతఃకాల సేవకు। నీమవెడలక నిలచియున్నవి। నిద్ర మేల్కొనరే॥ రంగా॥

౧౦. వీరరాఘవదాసు డెదుటను। వేడకొనద్దముబూని సేవను। కోరియున్నాడయ్య మహిషుల। గూడి మేలకొనరే॥ రంగా॥

మేలుకొను శ్రీరంగనాయక॥ మేలుకొను బ్రహ్మాండనాయక॥

శ్లో॥ మంగళం భగవన్విష్ణో మంగళం మధుసూదన। మంగ... పుండరీకాక్ష మంగళంగరుడధ్వజ॥ నీలాచలనివాసాయ నిత్యాయపరమాత్మనే। సుభద్రాబలభద్రాభ్యాం జగన్నాథాయ మంగళం॥

శ్లో॥ ఉపనయతుమంగళం నస్సకలజగన్మంగళాలయశ్శ్రీమాన్। దినకరకిరణనిబోధిత నవనలినదళనిభేక్షణో రామః॥

సమాప్తము.

